# కాంతిమతీపుష్పదంతము

ఆశుకవితావినోద విద్వాన్
కొప్పుకొండ వేంకటసుబ్బరాఘవకవి
విరచితము.



ది జ్యూపిటర్ ట్రేడింగ్ కంపెని,
174, రాసప్పచెట్టి వీధి,
పార్కు టౌన్, మదరాసు.

# తొలిపలుకు.

ఆర్యులారా! ఈ దృశ్యకావ్యమునకుఁ గాంతిమతీపుష్పదంత మని పేరు. ఇందు కాంతిమతి కథానాయిక. పుష్పదంతుఁడు కథానాయకుఁడు. ఇది యాంగ్లేయభాషయందలి "రెండుపట్టణముల కథ" (A Tale of Two Cities) అను స్కాటు మహాశయుని నవలకు గొంచెము సమీపించియుండును. దాని కిది మెఱుఁగనియే చెప్పవచ్చును. అయినను నిందలి కథావిధానము చాల మార్చి వ్రాయఁబడి యున్నది.

పరాసురాజ్య పరివర్తనకాలమున (French Revolution) జరిగిన మహాక్రూరకృత్యము లీగ్రంథమున వర్ణింపఁబడియున్నవి. అందువలననే యచ్చటచ్చట మరణములు సైఁతము దృశ్యవైఖరిఁ జూపఁబడినవి.

కథానాయకుఁడు పుష్పదంతుఁడు. చాల యోగ్యుఁడైనను దనతండ్రి యుపోద్బలముచేఁ గ్రూర వ్యవసాయుఁడై యుండును. ఇతనికి పరపీడయన్న పరమప్రీతి. మహాయోధుఁడు. ఇతని జయించుట కెవ్వరిచేతను సాధ్యపడదు. రూపజిత మన్మథుఁడు. అయినను నెవ్వరును నితని పూజింపరు. ఇతని క్రూరకర్మకు తోడ్పడిన భృత్యుఁడు మిత్రఘాతుఁడు. ఇతని సాయమునఁ జేయరాని కార్యములఁ బెక్కు లొనర్చెను. ప్రతిదినము దుర్వినీతుఁడు తన సభలో నాతని కుమారుఁడు చేసిన కార్యముల వరుసగ నడుగుచుండును.

విప్రలంబుఁడు, చండసేనుఁడు, విచిత్రసేనుఁడు మొదలగు పౌరకార్య ధురంధరులుచేరి క్రూరకర్ములగు రాజవంశజుల నందఱ నిర్మూలింప మొదలిడిరి. అప్పుడు చండసేనుఁడు పురవాసులందఱిఁ దనకు పరిచితులఁ జేసి కొనుటకయి కల్లంగడియుంచెను. అందఱాచోట ప్రతిదినము సభచేయుచుండిరి.

దుర్వినీతుని దుర్బోధచే పుష్పదంతుఁడు రాజప్రతి పక్షుల నిర్మూలనముచేయ బద్ధకంకణుఁడై మిత్రఘాతుఁడను సేవకుని మూల

మున విప్రలంబునిఁబట్టి కారాగృహమునందుంచెను. చండసేనుని పట్టుటకు సాధ్యపడకుండుటచే విచిత్రసేనునితో మైత్రిచేసికొని వాని గృహంబున కఱిగెను.

మదనికయను చండసేనుని సోదరి విచిత్రసేనుని వివాహము చేసికొనుటకయి ప్రయత్నించుచుండెను. అందుకనియే తనచెలియగు చతురికను బంపెను. నాఁటిదినమే విచిత్రసేను నింటికి పుష్పదంతుఁడు వచ్చియుండెను. మదనికయు నాఁడచ్చటికి పోయెను. విచిత్రసేనుఁడు తనకేదో పనికలిగి యా దినము చండసేనున కీవృత్తాంతము తెలిపి గృహమును భద్రముగాఁ జూచుకొనుమని చెప్పి వెళ్లిపోయెను.

మదనిక వచ్చుటచే పుష్పదంతుఁడు చాల సంతసించి యామెను సమీపించెను. ఈ విషయము తెలిసిన చెలి చండసేనునిఁ దెచ్చుటకయి వెడలిపోయెను. మదనిక పుష్పదంతు నొల్లమికి బలాత్కారముగ మిత్రఘాతునిచే బంధింపించి తీసికొనిపోవుచుండఁగా చండసేనుఁడు వచ్చి పోరాడి క్రిందపడిపోయెను. అతనిని సైతము బంధితునిఁజేసి వారిరువురను తనకారాగృహమునందుంచెను. వీరు మరణింపకుండునట్లు మందుల నిచ్చుటకయి మరుదశ్వునిఁ బిలువ నంపెను.

మరుదశ్వునికుమారి కారత్నంబే కాంతిమతి; లోకాతీతమైన సౌందర్యరాశి యనుటలో నిసుమంతయు సందియముండదు. అందు వలనఁ బుష్పదంతుఁడు కాంతిమతిని కైవసమొనర్పఁ బ్రయత్నించుచు మరుదశ్వునకు ననర్ఘరత్నకనక రౌప్యంబుల బహుమతులుగావించెను.

తుదకు చండసేనుఁడు కారాగృహంబుననే మరణించెను. మదనిక గాయములచే బాధపడుచుండెను. విచిత్రసేనుఁడు మరుదశ్వునిసాయమునఁ గారాగృహమును ప్రవేశించి యెటులనో గవాక్షమునుండి నిశ్రేణిమూలమునఁ జండసేనుని కళేబరమును, మదనికను క్రిందికి దింపి, తీసికొని మెల్లగా వెడలిపోయి, చండసేనున కుత్తరక్రియ లొనరించి, మదనికా ద్వితీయుఁడై యుజ్జయినీపురమునకుఁ బాఱిపోయెను.

ఉజ్జయినీపురమునందు చంద్రరేఖా రూపరేఖ లొకయింటి యందుండిరి. అవంతియందు మదనికా విచిత్రసేనులు లేకుండుటచే నుజ్జయినికి పోయియుందురని తలఁచి వచ్చిన పూర్వపరిచితలయిన చెలికత్తియలే వారు. కాన విచిత్రసేనుని మదనికను నాయూరనుండు పెద్దసత్రమునఁజూచి యానందించి తమగృహమునకుఁ దీసికొనివెళ్లి, యచ్చట నెరికిఁ దెలియకుండ నుంచుకొనియుండిరి.

పుష్పదంతుఁడు విచిత్రసేనుఁడు చనిపోవుటయు, నాతనికళే బరము సయితము కనఁబడకుండుటయు, మదనికయు నగోచర యగుటయు మొదలగు నసహాయకరణంబులు మరుదశ్వునిచే జరిగిన వని నిశ్చయించి యాతనికి కఠినదండన విధించెను. ఈ విషయమును దెలిసిన పౌరులు కొందఱు రాజవంశనిర్మూలనైక యంత్రక్రకచంబు నొక్కటి నిర్మించి దానిసాయంబున నందఱఁ జంపుచుండిరి. రాజ గృహమునఁ బ్రవేశించి దుర్వినీతుని హత్యగావించిరి.

ఇతఃపూర్వమే యేతాదృశ కార్యంబులు గలుగునని యూహిం చిన పుష్పదంతుఁడు పట్టణమును విడిచి యుజ్జయినీపురవరమునకుఁ పాఱిపోవుటకయి ప్రయత్నించువాఁడు ముందఱ మరుదశ్వుని గృహం బున కటిగి యాతనికుమార్తెయగు కాంతిమతిని సమీపించి "మీ తండ్రి యుజ్జయినియందున్నవాఁడు. నిన్ను త్వరగాఁదీసికొని రమ్మ నియె"నని నమ్మఁబలికి యామెను దోడ్కొని వెళ్లిపోయెను.

ఉజ్జయినియందు కాంతిమతిని వివాహమాడ నిర్బంధించు చుండెను. కాంతిమతి వానిఁ దిరస్కరించి దుర్వినీతుఁడు మరణించెనని చెప్పి యాతఁడు విషాదంబున మునిఁగియుండఁ దాను పరువిడియె. అప్పుడిద్దఱు చారులాతనిఁ బట్టుకొని కాంతిమతిచే నాతఁడు దోషియని నిర్ణయించుకొని రాజసమ్ముఖమునకుఁ గొనివచ్చిరి. రాజు పుష్ప దంతుని విచారించెను. కాంతిమతి మదనికకయి పర్యటించుచుండెను.

విచిత్రసేనుఁడు పుష్పదంతుని వృత్తాంతము తెలియఁగోరి పురంబునఁ గ్రుమ్మరుచుఁ దుదకురాజకారాగృహమునఁ బ్రవేశించి పుష్పదంతుని సమీపించి వాని సంకెలలను నూడఁదీసెను. దీర్ఘ

క్రోధుఁడగు పుష్పదంతుఁ డాతనిఁ దన కరవాలంబునఁ దుండించి మెలపున నాతని యుడుపులం దవిలించుకొని వెలుపలికి వచ్చెను. లోనికిఁ బ్రవేశించి యీ విషయమును దెలిసిన చారు లాతనికై పరుగిడుచుండిరి.

ఈ విషయమంతయుఁ గాంతిమతి తెలిసికొని యొక భవనమును సమీపించెను. ఆ చంద్రశాలయందు చంద్రరేఖ దూరమున వచ్చు కాంతిమతిని తెచ్చి మదనికకు సమర్పించెను. మదనిక తన భర్తకయి చాల తహతహపడుచుండెను. కాంతిమతి విచిత్రసేనుఁడు మరణించినదియు పుష్పదంతుఁడు పలాయితుఁడయినదియుఁ దెలిపెను. మదనిక చాల దుఃఖించెను.

వినోదముగాఁ గాలము కడుపుటకయి పురోద్యానమునకుఁ బోదమని చంద్రరేఖ వారితోఁజెప్పి వారిని తనవెంటఁ బెట్టుకొని పోయెను.

ఉద్యానవనంబున విచిత్రసేన వేషధారియగు పుష్పదంతుఁడు విహరించుచుండెను. వానింజూచి మదనికా కాంతిమతులు విచిత్రసేనుఁడని చాల భ్రమపడిరి. కాని యాతని కార్యకలాపంబులయందలి భిన్నత్వంబును దెలిసికొని మదనిక యాతనిచేఁ జచ్చుటకంటె నేనే చచ్చుట శ్రేయమని తన కరవాలంబునఁ బొడిచికొని మరణించెను. ఇది తెలిసిన పుష్పదంతుఁడు కాంతిమతిని సమీపించి యెంతయు నోదార్చెను. చంద్రరేఖయొక్క ప్రేరణచేతను, బోధనలచేతను కాంతిమతికి మనస్సుమాఱి యాపుష్పదంతునిపయి ప్రీతి గలుగుచుండెను. అందువలన పుష్పదంతుఁ డాయతివకు చాల నమ్మిక గలుగు వాగ్దానముల నెన్నింటినో తెలిపి కాంతిమతిని చాలనమ్మించి యానాఁడే సుదినమగుటచే చంద్రరేఖయొక్క సాయమున వివాహ కార్యంబుల నెరవేర్చి యుజ్జయినీపురంబుననే సుఖంబుగా జీవించుచుండెను. ఇయ్యది కథాసారంబు.

# ఇందలి పాత్రధారులు

1. దుర్వినీతుఁడు – అవంతీపురసార్వభౌముఁడు.
2. పుష్పదంతుఁడు – రాజకుమారుఁడు, కథానాయకుఁడు.
3. మిత్రఘాతుఁడు – ఒక సేవకుఁడు.
4. తరళిక – చండసేనుని చెలి.
5. చతురిక – మదనికయొక్క సఖి.
6. చండసేనుఁడు – మదనికయొక్క సోదరుఁడు.
(రాజవంశ నిర్మూలనైక బద్ధకంకణుఁడు)
7. విచిత్రసేనుఁడు – చండసేనుని మిత్రుఁడు.
8. మదనిక – చండసేనుని సోదరి.
9. విప్రలంబుఁడు – చండసేనుని పక్షమువాఁడు.
10. మరుదశ్వుఁడు – ప్రసిద్ధిచెందిన వైద్యుఁడు.
11. కాంతిమతి – మరుదశ్వుని కుమార్తె, కథానాయిక.
12. బ్రహ్మదత్తుఁడు – దుర్వినీతుని చారుఁడు.
13. కుబేరదత్తుఁడు – దుర్వినీతుని సేవకుఁడు.
14. చంద్రరేఖ, రూపరేఖ – మదనికయొక్క పూర్వపు సఖులు.
15. చండుఁడు, మార్తాండుఁడు – రాజభటులు.
16. బుద్ధిసారుఁడు – ఉజ్జయినీ రాజమంత్రి.

ఇందలి దోసంగులఁ బరిత్యజించి గుణంబుల గ్రహింప గుణగ్రహణపారీణులగు పండితమండలికి మన్నమోవాకంబు లర్పించుచున్నాఁడను.

ఇట్లు,
గ్రంథకర్త.

## OPINION

I have gone through this play and find that the dramatising of the novel "A Tale of the Two Cities" adapting it admirably to the Telugu language is an excellent piece of work. It affords very pleasant reading and is at the same time very impressive and instructive. It is bound to prove quite a suitable text for the Intermediate class.

Madras,
22-9-1944

R. JANARDHANAM NAIDU,
*B.A., L.T., D.E. (Oxon.) D.L.S. (Lond) F.L.A.*
*Librarian, Connemara Public Library, Madras.*

## అభిప్రాయము

బ్రహ్మశ్రీ కొప్పుకొండ వేంకటసుబ్బరాఘవ కవిగారికి—

మహాశయా! తాము పంపిన శ్రీకాంతిమతీపుష్పదంతమను దృశ్యకావ్యమును స్థాలీపులాకన్యాయముగాఁ జదివి యానందించితిని. స్కాటుమహాశయుని నవలను నాటకముగా మార్చి వ్రాయుటయందలి తమ నేర్పునకుఁ జాల సబ్బురమొదవెను. ఇట్టివి మఱికొన్ని విరచించి తెలుఁగు ప్రపంచమునకు వన్నియఁ దేఁదలఁతురుగాక! ఈ గ్రంథము ప్రభుత్వమువారిచే ప్రవేశపరీక్షకు నాటకముగా నిర్ణయింపఁబడుఁగాక!

మదరాసు,
తే.22-9-1944

ఇట్లు,
ఆర్. జనార్ధనము నాయుఁడు.

# కాంతిమతీపుష్పదంతము

## (దృశ్యప్రబంధము)

---

జ య హ య వ ద న

## —నాంది—

ఉ. శ్రీలనొసంగుఁగాత నుదరీకృత కంజభవాండభాండక
ల్లోలుఁడు, పాలనైకగుణలోలుఁడు, సాధుజనావనక్రియా
శీలుఁడు, లోకవిభ్రమణ చిత్తజమోహసురీమనోజ్ఞ పాం
చాలుఁడు, కాలచక్రవిలసద్భ్రమణాయితలోకచక్రుఁడై.

ప్రవేశము :—నాంద్యంతమున సూత్రధారుఁడు, నటి.

నటి :—ఆర్యపుత్రా! ఏమో యాలోచించుచున్నట్లున్నదే?

సూత్రధారుఁడు :—సఖీ! ఈ దినము సుదినము. అనేక కార్య వ్యాసంగమనోవ్యాకులుఁడనైన నాకొక ప్రత్యవాయమూహించి గతసంవత్సరాషాఢమాసమున మీ పాఠశాలయందు నీవు ప్రదర్శింపఁ దలఁకొని తెలిపినదియు, శ్రీ కొప్పుకొండ వేంకట సుబ్బరాఘవాభిధాన విరచితంబును నగు శ్రీ కాంతి మతీపుష్పదంతుల కల్యాణనాటక విషయమును నేను విస్మరించియుండి, యిప్పుడు నీ దర్శనమున జ్ఞప్తికిఁ దెచ్చికొంటిని.

నటి :—ఆర్యా! అది నిజమే. తమరు కార్యవ్యగ్రులై కార్యాంతరమున నుందురనితలఁచియే గతవృత్తమును స్మరింపఁజేయుటకే యిట కేతెంచితిని.

సూ :—చెలీ! నీవంతగా వాకొనుటకు కాంతిమతీ పుష్పదంతుల కల్యాణమంత యద్భుతావహకార్య దృశ్యములు గలదియా యేమి?

నటి :—కాకేమి, వినుము.

తే. ఎందుఁజూచిన బుద్ధి నూహింపరాని
దుర్వినీతబాధాతమస్తోమబంధు
రాత్తహింసారిరంసావిహారములకు
భావ్యదాస్థాని వరియించె వైరివనిత.

తే. క్రూరహింసావినోది యావీరవరుఁడు
పుష్పదంతుఁడు వైరిజఁ బుష్పగంధిఁ
గాంతిమతి నెట్లు శత్రువిగ్రహము లేక
చేకొనియె దృశ్యవైఖరిఁ జేయవలయు.

సూ :—అయిన మన మాలసింపరాదు. "ఆలస్యా దమృతం విష" మ్మన వినవే. పోదము, పద.

(నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

# ప్రథమాంకము

## రంగము—1.

[అవంతీపురము - దుర్వినీతుని సభ - దుర్వినీతుఁడు, పుష్ప దంతుఁడు సింహాసనములపై నాసీనులై యుందురు.]

దుర్వినీతుఁడు :—కుమారా! నిన్నటిదినమున నీవుచేసిన కృత్యము లేవేవో తెల్పుము......నా మాటలు మరువవుగదా? ఈ యవంతీపురవైభవమును వేనోళ్ళ చాటింపవలయును సుమా?

పుష్పదంతుఁడు ;—తండ్రీ! మీ యాజ్ఞను శిరసావహించి మన పేరనిన సమస్తజనులకు గుండియలవియునట్లు చేసి వచ్చితిని.

దుర్వి :—ఆయుష్మంతుఁడా! గత దివసవృత్తాంతములను వరుసగా వచింపుము. చూతము.

పుష్ప :—మన శత్రువ్యూహమునకుఁజేరిన విప్రలంబుని నాపాద మస్తకము పాశములచే బిగించి మన యంధతామిస్రనామక కారాగృహమున నుంచితిని.

దుర్వి :—అప్పుడేమి జరిగెను?

పుష్ప :—అతని భార్య యతనికై యడ్డుపడెను.

దుర్వి :—తరువాత.

పుష్ప :—ఏమున్నది. మన కరవాలధార కెరయే.

దుర్వి.—అతని స్నేహితులేమైరి?

పుష్ప :—వారిలో చండసేనుఁ డనువాఁడు మాత్రము తప్పించుకొని పాఱిపోయెను. మిగిలిన వారిని చేతులు పాదములు కట్టి చెఱ సాలలో వ్రేలాడవైచితిని.

దుర్వి :—చండసేనుని వెదుక భటుల నంపితివి కావా?

పుష్ప :—పంపియుంటిని మహాప్రభూ! వారేమయిరో యింతవఱకుఁ దెలియవచ్చినది కాదు. ఇదిగో యిటకే కంచుకి యరుదెంచుచున్నాఁడు.

ప్రవేశము—కంచుకి.

కంచుకి :—దేవా! తమరు పంపిన దూతలలో నొకఁడయిన మిత్రఘాతుఁడు మాత్రము తిరిగివచ్చి తమ దర్శనార్థమై ద్వారము కడ వేచియున్నాఁడు. తమ యాజ్ఞయైన లోనఁ బ్రవేశ పెట్టెదను.

దుర్వి :—ఆహా! ప్రవేశపెట్టుము.

కంచుకి :—చిత్తము. (నిష్క్రమించును)

కంచుకి మిత్రఘాతుల ప్రవేశము

కంచుకి .—ఇటు. ఇటు. (త్రోవ చూపును.)

మిత్రఘాతుఁడు :—మహాప్రభూ! జయము. జయము.

దుర్వి :—మిత్రఘాతా! నీవు పట్టినకార్యము సఫలమైనదా?

మిత్ర :—దేవా! నేను చండసేనుని వెదకి వెదకి తుదకొక కల్లంగడి యందు నాతినింజూడఁ గలిగితిని. అతఁడొక్కఁడే కాక ఆతని స్నేహితులందఱు ఆయుష్మంతులపయిఁ బగఁబూని యున్నవారలు. వారందఱు నన్నుజూచి తిరస్కరించుటయే కాక మర్దించి పంపిరి.

దుర్వి :—మిత్రఘాతా! ఏమీ నీకు మర్దనమా!

తే. ఎఱుఁగ రేమో మదీయసింహేంద్రభూరి
విస్ఫురద్బాహువిక్రమోద్విస్ఫులింగ
నీచశలభాయితమహోగ్రశోచనీయ
దశలు, కశలఁ వినోదసంతాడనములు,
కలితలోచనగోళసోద్ఘాటనములు.

పుష్ప :—(కోపముతో)

తే. దుర్వినీతసభాస్తారదోఃపతంగ
పన్నగాయిత జీవులౌ పౌరులకును
మద్యవిఫణీసమాసన్నమండలికిని
తెలియదా పుష్పదంతుని దీవ్యదాజ్ఞ?

మిత్ర :—

మ. అరరే! యీ మధుపానసంతతికి నౌరా? దుష్ప్రలాపౌఘసం
కరదర్పాంధతమోవిలాస మతిలోకస్ఫీతమై క్రాలెడిన్
మురవిధ్వంసి కసాధ్యమా? మధులసన్మూర్ధంబు చీల్పంగఁ;దొం
దరగా నందఱ నంతకాంతికదశన్ దక్కింపఁగాఁ జేయరే!

దుర్వి :—(పుష్పదంతునిఁజూచి) చిరంజీవీ! ఇప్పట్టునఁ జేయందగిన కార్యంబుల నెఱిఁగింపుము.

పుష్ప :—

తే. సకల మెఱిఁగిన మీకునే సరవిఁజెప్పఁ
జాల; నను గౌరవించి యోచనల నడుగఁ
దెలిసినవి చెప్పఁదలఁకొని వలతు నేను
సావధాన మనస్కులరై వినుఁ డిది.

తండ్రీ! చండసేనుని మిత్రమైన విచిత్రసేనునిఁ గలిసి యాతనితో మన యభిప్రాయంబుఁ దెలుపక నచ్చికబుచ్చికలాడుచు నుండి యెటులనైన నాతని నేకాక యాతనిసోదరియగు మదనికను సైతము తెచ్చెదను.

దుర్వి :—కుమారా! బాగు. ఇదియే ప్రకృతమనుసరణీయమైన కృత్యము. కార్య పరతంత్రుఁడవై నీతంత్ర మేరికిఁ దెలుపక నెరవేర్చికొని వచ్చెదవు గాక!.......(కొంచెమాలోచించి) ఈ కార్యమున నీకు సాయ మెవండు?

పుష్ప :— తెలియదా! మన భృత్యశ్రేష్ఠుఁడైన మిత్రఘాతుఁడే.

దుర్వి :—హంసలన్నియు మానససరోవరంబునఁ జేరినట్లు మన సేవకబృందమంతయు మనమేలుగోరి మనగృహంబుననే వసించుచున్నది.

మిత్ర :—మహాప్రభూ! స్వామి యనుగ్రహముండిననే కదా మా జీవనము.

దుర్వి :—మిత్రఘాతా! ఈ కార్యంబున నాయుష్మంతునకు సరియైన తగవరివై యుండుము.

మిత్ర :—చిత్తము దేవా! తమయాజ్ఞ శిరసావహింతును.

దుర్వి :—కుమారా! ఇఁక నాలసింపఁ బనిలేదు. కార్యపరత నుండుము. నీకు జయమగుఁగాక!

పుష్ప :—తండ్రీ! నమస్కారము. తమ యాశీర్వచన బలంబుననే సకలకార్యసిద్ధుండ నయ్యెద. (అటుచూచి) మిత్రఘాతా! రమ్ము, పోదము. (అని నిష్క్రమింతురు.)

---

# ద్వితీయాంకము

## రంగము—2.

ప్రవేశము :—తరళిక చతురికలు.

తరళిక :—(ఆత్మగతము) నాతో మదనిక తనకు రాజకుమారుఁడైన పుష్పదంతునిపయి వలపులేదనియుఁ, దనసోదర మిత్రమైన విచిత్రసేనునిపయిఁ బ్రీతిగలదనియుఁ దెల్పినది. అందునకే యింతకుముందు చతురికచేతిలో నొకయుత్తరము వ్రాసి మదనిక పంపియున్నది. అదియు నింతకు విచిత్రసేనుని కడనుండి యతనియభిమతమును దెలిసికొని వచ్చుచుండును. నేనిచ్చటనే కొంతతడవు వేచియుండెదను. (నిట్టూర్పు పుచ్చి ఇటునటుచూచి) ఇదిగో చతురిక వచ్చుచున్నది. ధన్యోస్మి. (సమీపించి) చతురికా! విచిత్రసేనుఁ డేమనియె?

చతు :—రేపటిదినము తన కేదో పనియుంటఁబట్టి గృహమందుండ సాధ్యపడదని నుడివెను.

తరళిక :—అయిన నెట్లు? మనభ ర్తృ దారిక యెటులనైన రేపటి కాతని గృహప్రవేశము సేయ కృతనిశ్చయమైయున్న యది. దీని కిఁక ప్రత్యవాయ మేమి?

చతు :—ఎటులనో యాతనియిలు సేర్చుభారము నాయది. అతఁడు లేకుండిన నుండుఁగాక! మన మదనిక పట్టినపట్టు విడువదు.

తర :—అట్లైనసరి. పుష్పదంతుని వృత్తాంత మేమైన తెలియవచ్చి నదా?

చతు :— తెలియ కేమి?

తర :—అయితే మదనిక విషయమై యాతఁడు సేయు పన్నాగమును దెల్పఁగలవా?

చతు: —చెలీ! ఇప్పుడు పుష్పదంతుఁడు తండ్రి యాజ్ఞఁబూని విచిత్రసేనుని గృహమునకు వచ్చెను. ఆతనితోడ నాహార విహారాదుల, సరససల్లాపములఁ ప్రొద్దుపుచ్చుచున్నాఁడు.

తర: —మదనిక వృత్తాంత మేమైన నె త్తెనా?

చతు :—మదనికపయి తనకుఁగల మరులు తెలుపక రాకుమా రుండు విచిత్రసేనునితోడ మెలంగుచున్నాఁడు. సందర్భాను సారముగ మదనిక యెవరని తనమిత్రు నడిగెను.

తర :—అతఁ డేమనియె?

చతు :—"పరస్త్రీ విషయ మెందుకు? అది సర్వదా పరిహ ర్తవ్య" మ్మని విచిత్రసేనుఁడు చెప్పెను.

తర :—అప్పు డేమనియెఁ బుష్పదంతుఁడు?

చతు :—తనలో నితనికిఁగూడ మదనికపై మరులున్నదని గ్రహించి "అది నిజమే" యని యూరకుండెను.

తర :—చండసేనుని విషయమయి తలపెట్టెనా యేమి?

చతు :—చండసేనుని విషయమే యాతఁడు పూర్తిగా మరచినట్లు సదా ఉన్మత్తుని పగిదిఁ దిరుగు చున్నాఁడు.

తర :—రేపటి దినము మదనిక వచ్చుననెడి వార్త యాతనికిఁ దెలియునా ?

చతు :—తెలియదు. కాని పుష్పదంతుఁడు రేపంతయు విచిత్రసేనుని గృహమునందే యుండును.

తర :—అయితే రొట్టెవిఱిగి తేనెలోఁ బడినట్టవునే.

చతు :—మా భర్తృదారికకు ఆసంబంధమే యిష్టము లేదు. ఆతని పన్నుగడలను స్మరించినంతన గుండియలదరు చున్నవమ్మా! ఏమిచేయుదును. విచిత్రసేనుఁడు సయితమింట నుండఁబోఁడు.

తర :—అయితే యీ విషయమును మీా భర్తృదారికకుఁ దెలుపవా?

చతు :—తెలుపకేమి ? దానికై యెన్నిపన్నాగములనో పన్ని మనసును ద్రిప్ప ప్రయత్నింతును.

తర.—అట్లు చేయవమ్మా! నేను చండసేనునకు ఆసవము తెచ్చుటకయి యంగడికిఁ బోయివచ్చెదను.

చతు :—చెలీ! మా భర్తృదారిక విషయముంగూడ నాతనికి నివేదించి రేపటికి విచిత్రసేనుఁ డింటనుండునట్లు సేయుము. చాలును. నేను బోయివచ్చెదను.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది విష్కంభము.

## రంగము—3. కల్లంగడి.

ప్రవేశము.—విచిత్రసేనుఁడు చండసేనుఁడు తదితరులు.

చండసేనుఁడు :—మిత్రమా! విచిత్రా! మనలను నెటులనైనఁ బట్టి కారాగృహమున నుంచవలయునని పుష్పదంతుఁడు పట్టుపట్టి యున్నాఁడు. తెలియునా నీ కావిషయము ?

విచిత్రసేనుఁడు :— తెలియ కేమి. వాఁడు విశ్వాసఘాతుకుఁడు సుమా!

చండ :—ఎందువలన నీ వట్లనుచున్నాఁడవు ?

విచి :—అతఁడు మనమదనికా వృత్తాంతమును పైఁతము నెఱుఁగఁ గోరెను.

చండ :—ఆ దుర్మార్గకుటుంబమును, ఆతనిని నాశమొనర్ప వలయును ? వారు చేయు దుష్కృత్యములకు మేరయే లేదు.

విచి :— రేపటికి నేనింటనుండఁబోను. నీవు గృహరక్షణము సేయు చుండుము.

చండ :—ఆహా ! ఆలాగే.

1-వ త్రాగుబోఁతు :—చండసేనయ్యగారూ ? తమసారాయము బహు రుచ్యమండీ. ఒక ముంతెఁడు పట్టివ్వండి.

2-వ త్రాగుబోఁతు .—అయ్యగారూ ! ఈ మద్యము అమృత తుల్యమునుఁడీ! రెండు ముంతలుపోసి పుణ్యముగట్టికొనుఁడు.

3-వ త్రాగుబోఁతు :—స్వామీ ! ఈ పిల్లకాల్వలన్నీ కల్లేకావాలి. సముద్రాలన్నీ మీ సారాయే కావాలనండీ. అప్పుడేకదా ముంతలతో లెక్కలేకుండ త్రాగడము. నాకేమైనఁ గొంచెము దయచేయుదురా ?

(చండసేనుండు సారాయము పోయును.)

(అందఱు త్రాగుచు, తూలుచు, నొకరిమొగమొకరు చూచు కొందురు)

చండసేనుఁడు:—మహాజనులారా ! రాత్రియైనది. అంగడిమూసెదను. మీమీ గృహముల కఱుగుఁడు. ఇఁక రేపు కలిసికొందము.

(అందఱు నిష్క్రమింతురు)

## రంగము—4.

[విచిత్రసేనుని గృహము. పుష్పదంతుఁడు, మిత్రఘాతుఁడు విహరించుచుందురు.]

ప్రవేశము :—చతురిక, మదనికలు.

చతు :—దేవీ! ఇటునిటు.

మద :—సఖీ! ఎవరో లోపల నున్నట్లున్నదే.

చతు :—అల్లదే పుష్పదంతరాజకుమారులు.

మద :—చతురికా! గుండియలు జల్లుమనుచున్నదే. (భయము నభినయించుచు) ఇఁక నేమిసేయుట.

చతు :—తంత్రమునఁ దప్పించుకొని కాలికి బుద్ధిసెప్పుటయే.

మద :—(కొంచెము ధైర్య మవలంబించి) అతఁడేమి చేయునో చూచెదఁగాక! చెలీ! నీవు నా కంగరక్షగా నుండుము.

చతు :—నాకధికభయముగా నున్నది. త్వరగా మీ సోదరునిఁ దెచ్చెదఁగాక.

మద :—అలాగే చేయుము.

చతు :—చిత్తము. (నిష్క్రమించును)

మద :—(ఇటునటుచూచి) అమ్మో! పెద్దపులిలాగు ఇటకే యరు దెంచుచున్నాఁడా పెను భూతభీమన్న. ఇఁక నేమిగతి.

పుష్ప :—(సమీపించి) మదనికా! మదనికా!

మద :—ఎవఁడవు నీవు?

పుష్ప :—తెలియదా? రాజకుమారుఁడను. పుష్పదంతుఁడను. నీ వలచినవాఁడను.

మద :—పుష్పదంతుఁడా గిప్పదంతుఁడా. దూరముగాఁ దొలఁగి పొమ్ము.

పుష్ప :—దూరముగాఁ దొలఁగుటకు నే నస్పృశ్యుఁడనుగాను. మఱెవ్వఁడనుగాను. నీకు ప్రేమపాత్రమను.

మద :—నీదురాగతభాషణంబు లట్టు గట్టిపెట్టి దూరముగాఁ దొలంగిపో. పోకుంటివేని మెడపట్టి గెంటించెద సుమీ!

పుష్ప :—ఏమీ? ఆలాగా. ఇదిగో నాకరవాలము. ఇదియే నా కనురక్తులుగాని వారికంఠరక్తములఁ జవిచూచునది.

(అని ఖడ్గమును జళిపించును.)

మద :—అమ్మో! చస్తిని, చస్తిని. (పడిపోవును.)

పుష్ప :—మిత్రఘూతా! దీనిని కాళ్లుసేతులు బాగుగాఁగట్టి పదిలముగా శకటమునందుంపుము. (కొంచెమాలకించి) ఏమి యీ శబ్దము? ఎవఁడో యొకఁడు వచ్చుచున్నాఁడు. మిత్రమా! ఎవఁడతఁడు?

మిత్ర :—రాకుమారా! అతఁడే చండసేనుఁడు. తనచెలియలిని భంగపెట్టుట తెలిసి పరువిడి వచ్చుచున్నాఁడు.

పుష్ప :—ఆహా! ఇఁకమనకు సునాయాసముగా దొఱకొను. వంటయింటి కుందేలితఁడెందుఁబోఁగలఁడు.

మిత్ర :—అదిగో సమీపించెను. కత్తివిసరుము. (పుష్పదంతుఁడు కత్తిత్రిప్పును. చండసేనుఁడతనితోఁ దలపడును. గాయములు తగిలి చండసేనుఁడు మూర్ఛిల్లును.)

పుష్ప :—

తే. నన్ను మీఱంగ జీవించు నాగరికుఁడు
పట్టణంబున నుండినఁ బట్టి కట్టి
బంధితునిఁ జేసి కారాగృహాంధతమస
మందుఁ ద్రోయింతు నిది నాకు న్యాయ్యమగును.

మిత్రమా! మిత్రఘూతా! వీరి నిద్దఱ శకటంబున నుంచి కారాగృహంబుననుండు పడుకలయందుఁ బవళింపఁజేసి రమ్ము. నేను నగరునకు తండ్రి దర్శనార్థమై వెళ్లెదను.

మిత్ర :—చిత్తము. మహాప్రభూ! (ఇద్దఱు నిష్క్రమింతురు.)

*

# తృతీయాంకము

## రంగము—5

[అంధతామిస్రనామక కారాగృహము. అందు గాయములు తగిలినవారు, కొనయూపిరితోనుండువారు, మఱియుఁ గొందఱు మూల్గుచుందురు.]

ప్రవేశము—దుర్వినీతుఁడు, పుష్పదంతుఁడు.

దుర్వినీతుఁడు :—కుమారా! నిన్నటిదినము నీవు చెఱసాల కతిథులుగాఁ బంపినవా రెచ్చట?

పుష్పదంతుఁడు:—తండ్రీ! అదిగో ఆ మంచముల నలంకరించి మూల్గుచున్నవా రే వారు.

దుర్వినీతుఁడు :—ఈ చండసేనునకు మన బలపరాక్రమాది యాదార్థ్యగుణములు తెలియదు కాఁబోలు. లేకుండినఁ దన సోదరిని రూపరేఖావిలాసాదుల మన్మథుంబోలిన రాకుమారునకు నీకిచ్చి వివాహముసేయుట కొడంబడక తక్కునే? ఏ తొక్కునకీ చక్కని నీఁదలఁచియున్నాఁడో కదా!

పుష్ప :—తెలియదా? తన మిత్రుఁడగు విచిత్రసేనున కీఁ దలంచెను గదా!

దుర్వి :—ఏమి! మనకంటె నాతఁడు దేనియందు గొప్పయని తలఁచెనో?

పుష్ప :—దేనియందో కాదు, దారిద్ర్యమందే. ఇతఁడహరహంబు నేకాదశిదినోపవాసి; యతఁడు శివరాత్రిదినోపవాసి.

దుర్వి :—(కొంతసేపాలకించి) ఆబిడ దగ్గఱనుండి పెద్దపెద్దమూల్గులు వెలువడుచున్నవియ. చండసేనునిఁజూడ బ్రదుకుటయే దుర్లభమని తోఁచుచున్నది.

పుష్ప :—ఎవరి నొసటివ్రాఁత ఫలము వా రనుభవింపవలయును గదా!

దుర్వి :—ఇప్పు డీతనిప్రాణములు నిలుపుటకు తగిన చికిత్స సేయింప వలయును. ఎందుకనఁగా ;

తే. మరణమొందిన నాతని కెఱుకయున్నె ?
తెలియ మనమీఁద పగనుసాధించు టెట్లు ?
అతఁడు జీవించియుండిన నాతనికిని
మనకుఁగూడ పనుల్ గల వనియతముగ.

ఉ. రావణకుంభకర్ణులను రాక్షసవీరులఁ జంపినందునన్
జేవదలిర్పఁ గార్యములు చేయుట కెంతయుఁదోఁచకుండి సీ
తావనితామణిన్ వనవితానములందు వితాకుఁజెంద రా
మావనిజానిచేసి తురగాధ్వరమొక్కటిఁజేసె నిష్క్రియన్.

ఉ. కాన మనీషివర్యుఁ డురుగర్వపరాక్రమశాలియైన వై
రానకుఁ బిల్చువానినిఁ జరాలునఁ జంపఁగరాదు ; జంపెనేన్
జానపదావలంబియయి చర్వితచర్వణకార్యుఁడై క్రియా
హీన నఖప్రభేదరతి నెంతయునుండెడు సోమరింబలెన్.

పుష్ప :—అందువలననే మన పట్టణమునందే కాక మన దేశమునందం తటను ప్రఖ్యాతివహించిన వైద్యవిద్వాంసుఁడైన మరుద శ్వునిఁ బిలువనంపుట యత్యుత్తమపక్షమని నాకుఁ దోఁచు చున్నది.

దుర్వి :—ఆయుష్మంతుఁడా ! బాగుగా నాలోచించి పల్కితివి. అతనిప్రాపు మన కత్యావశ్యకము. అతనికి చక్కనిచక్క యగు కాంతిమతియను కుమరితగలదనియు నేను వింటిని.

పుష్ప :—ఆ విషయము నాకు పూర్వమే తెలిసియే యాతని నిటకు రప్పించి ప్రతిచికిత్సకును నధిక బహుమానముల గౌరవింప వలయునని తలఁచితి. ఆ గౌరవమర్యాదలను జూచి తన కూఁతు నా కొసంగుట కియ్యకొనును.

దుర్వి :—మదనిక యొకవేళ బ్రతికినయెడల బలవంతపు మాఘ స్నానముగా నుండును.

పుష్ప :—లేకేమి ? హృదయము తెలియనివారిచెలిమి యొక చెలిమియే.

దుర్వి :—అయిన త్వరగా మరుదశ్వుని కడకు దూత నంపుము.

పుష్ప :—చిత్తము. ఇంతకుఁ బూర్వమే కంచుకినిఁ బంపియుంటిని. అతఁ డిప్పటికి ద్వారము ప్రవేశించియుండును.

ప్రవేశము—కంచుకి, మరుదశ్వుఁడు.

దుర్వి :—(వినుట యభినయించి) ఎవరక్కడ ?

కంచుకి :—స్వామీ ! ఇదిగో అపరధన్వంతరి మరుదశ్వుఁడు.

దుర్వి :—వైద్యమహాశయులకు స్వాగతము.

మరుదశ్వుఁడు :—మహారాజులుంగారికి జయమగుఁగాక.

(అని కూర్చుండును.)

దుర్వి :—మరుదశ్వవైద్యరాజా ! మీ రీవనితకును, నీ చిన్నవానికిని చికిత్స సేయవలయును. ఇది తప్పని పని సుమా !

మరు :—చిత్తము, మహాప్రభూ ! నేను పరదేశంబుల నేర్చిన యస్త్ర చికిత్సలనైనఁ ఇప్పట్టున నుపయోగించి వీరల రక్షింపఁ జూచెదను. కాని వీరి ప్రాణముల నాపుదల చేయుటకు నాకు శక్తిచాలదు సుమా !

దుర్వి :—ఎవ్వరును ప్రాణముల నిలుపఁజాలరు గదా !

చ. మరణము వచ్చుచుండు జనమండలి కంతయు సర్వసామ్యమై;
మరణము జీవకోటికి సమానము; కీటకజాతినుండియు
ద్ధురమదగండదంతివరదుర్భరవీర్యసుధూర్వహాళికిన్
మరణము సాజమందఱకు మర్త్యులమాట నెఱుంగరే భువిన్.

దుర్వి :—అందువలన మీ యిష్టానుసారముగఁ జికిత్ససేయుఁడు.

పుష్ప :—మీరు ధన్వంతరులు గదా !

దుర్వి :—మేము పోయివచ్చెదము. (నిష్క్రమింతురు)

మరు :—నేనును వలసినమందులఁ గైకొని వచ్చెదను.

(నిష్క్రమించును)

## రంగము—6.

ప్రవేశము—కుబేరదత్తుఁడు, బ్రహ్మదత్తుఁడు.

కుబేరదత్తుఁడు.—(స్వగతము) మా యజమానుఁడు కారాగృహవాసులైన చండసేనునకును మదనికకును చికిత్ససేయుటకై కొన్ని వనమూలికలను దెమ్మనియె. అన్నింటినిఁ దెచ్చి యిచ్చితినే కాని తెల్ల ఉప్పిలిచేఱు దొఱుకకున్నది. ఈ వనమున వెదకి చూచెదను........

(దృష్టిసారించి) ఇదిగో పుష్పదంతుని సేవకుఁడైన బ్రహ్మదత్తుఁ డిటే వచ్చుచున్నాఁడు. అతనిం జేరి చెఱసాలయందలి వృత్తాంతమును దెలిసికొనియెద.

(సమీపించి) ఓయీ బ్రహ్మదత్తా! ఎచ్చటికోయి వేగముగా వెళ్లుచున్నాఁడవు?

బ్రహ్మదత్తుఁడు:—నీకుఁ దెలియదు కాఁబోలు. ఇది పరమ రహస్యకార్యము. దీని నెవ్వరకుఁ దెలుపరాదు.

కుబే:—అతిరహస్యము బట్టబయలన వినమే. చెప్పవయ్యా, పిచ్చి పుల్లయ్యా! తల్లి పుట్టినిల్లు మేనమామ కెఱుకయా?

బ్రహ్మ:—అయితే నీ వెవ్వరి కీవిషయము చెప్పనని యొట్టుపెట్టుకొన్న యెడలఁ జెప్పెదను.

కుబే:—మాయబ్బతోడు, మాతల్లిసాక్షిగా నే నెవ్వరికిఁ జెప్పను.

బ్రహ్మ:—ఆలాగైతే దగ్గఱకురా, చెప్పెద.

కుబే:—ఆఁ. చెప్పుము, వినియెదఁగాక.

బ్రహ్మ:—అంత బిగ్గఱగాఁ జెప్పరాదయ్యా, కొండమీఁది రచ్చ యేమిటనఁ గోమటి రహస్యమన్నట్లా?

కుబే:—ఆలాగుకాదు, మెల్లగా నాచెవిలోఁ జెప్పి వెళ్లుము.

బ్రహ్మ:—(దగ్గఱకువచ్చి చెవిలో) దుర్వినీతుఁడు, మారాజుగారు

చండసేనుఁడను వానికి నాచేతిలోనుండు పాలలో విషము కలిపి యిమ్మనియెను. మదనికయను పడుచున కీవిషయము తెలియకుండుటకై మద్యము పోయుమనియెను. అందునకే నేను పోవుచున్నాను. నీ వెక్కడికి పోవడము.

కుబే :—తెల్ల ఉప్పిలికై.

బ్రహ్మ :—అదిగో ఆగృహద్వారముకడ కావలసినన్ని చెట్లున్నవి. తీసికొని వెళ్లిపొమ్ము. నేను పోయివచ్చెదను.

కుబే :—(స్వగతము) మరుదశ్వునితో నీ విషయమును జెప్పి వాని ప్రాణములను రక్షింపవలయును. (నిష్క్రమించును.)

ఇది విష్కంభము.

## రంగము—7.

[కారాగృహము. మరుదశ్వుఁడు చికిత్ససేయుచుండుట.]

ప్రవేశము—బ్రహ్మదత్తుఁడు.

బ్రహ్మదత్తుఁడు :—మరుదశ్వవైద్యరాజా! ఈ మంచిపాలను చండసేనునకిచ్చి సేదఁ దేర్పుమని మారాజుగా రుత్తరువిచ్చిరి.

మరుదశ్వుఁడు :—మంచి యావుపాలేనా?

బ్రహ్మ :—అందుకు సందేహమేమి.

మరు :—కాని దాని నిప్పుడీకుము. ఇప్పుడే మందిచ్చియుండుటచే నింతలో నాహారము లోనికిపోయిన వమనమగును.

బ్రహ్మ :—(స్వగతము) వమనమైనయెడల సర్వకార్యము నాశనమగును. (ప్రకాశము) ఆలాగే కాని నేను తొందరగాఁ బోవలయును.

మరు :—అంత పనిమీఁద నున్నయెడల నచ్చట నుంచి వెడలుము. నేను సమయము చూచి యిచ్చెద.

బ్రహ్మ :—ఆలాగే, అట్లేచేయుఁడు.

ఈ పాత్ర మితనికి; ఆపాత్ర మామెకు. గుర్తుంచుకొనుఁడు. (నిష్క్రమించును) నేఁ బోయివచ్చెద.

ప్రవేశము—కుబేరదత్తుఁడు.

కుబే :—స్వామీ! ఇదిగో తెల్లఉప్పిలి. కాని యొక రహస్యము ఈ పాలలో విషమున్నది. తెలిసికొనుఁడు. నేఁబోయి వచ్చెద. (నిష్క్రమించును.)

మరు :—(స్వగతము) ఈ మహాశయుని ప్రాణములు తీయుటకయి తేఁబడిన పయోముఖవిషకుంభము లివి. కుబేరదత్తుఁడిపుడే చెప్పివెళ్లెను గదా! వీనిని పాఱఁబోసెదను. (శబ్దమునాలకించి) ఎవరక్కడ ?

విచిత్రసేనుఁడు :—నేను విచిత్రసేనుఁడనువాఁడ. నా ప్రాణమిత్రుఁడు చండసేనునియొక్కయు, నతని సోదరియొక్కయుఁ బ్రాణములఁ గాపాడవలయునని బద్ధకంకణుఁడనై తిని.

మరు :—మహాశయా! త్వరగా గవాక్షపు కమ్ములను తీసి లోనికి రమ్ము. ఎవరును లేరు.

విచిత్ర :—(లోనికి ప్రవేశించి) నా ముద్దుబొమ్మయుండు పడుకయేనా యిది? నా ప్రియస్నేహితుండుండు స్థలమేనాయిది?

మరు :—(వెవ్వేఱ నిద్దఱ నిర్దేశించి చూపును)

విచిత్ర :—అతని నాడిని పరీక్షింపుఁడు.

మరు :—(చూచుట కభినయించి) ఓహో! విచిత్రసేనా! నీమిత్రము పరమపదించెను.

విచిత్ర :—ఆహా! దైవమా!

మ. పరమప్రాణసఖుండు, దుష్టదమనప్రాజ్ఞైక చక్రుండు, బం
ధురబాహాబల నిర్జితారిబల సందోహుండు, శ్రీ చండసే
న రతీశుండు గెడంగె ; నిట్లు పౌనరంగాంక్షించె దుర్భావదు
ష్కరకార్యాత్మక పుష్పదంతుఁ డనిలోకస్ఫీతతేజంబునన్.

(విషాదము నభినయించుచు) నా ముద్దుల మూట, చిలుకల కొలికి, మదనిక యెటులున్నదో చూడుడు.

మరు :—(నాడిని జూచి) ప్రాణభయమేమియు లేదు. ఈ దినమందే యీమెను తీసికొని వెడలక పోయినయెడల మహాపద సంభవింపగలదు.

విచిత్ర :—సరి....నే నొకసహాయ మపేక్షించుచున్నాడను.

మరు :—నా జీవితసర్వస్వము వీరికై దారవోసెదను, సెలవిండు.

విచిత్ర :—ఆర్యా! ఇతని శరీరము నెత్తికొని గవాక్షమునకు గట్టియున్న నిచ్చెనపైనుండి క్రిందికి దిగెదను. మీరీపడుచును కిటికిదగ్గఱకు తెచ్చియుంచిన యెడల జాలును. తరువాత నాతనికి జేయవలసిన కార్యముల నెరవేర్చెదను.

మరు :—తెచ్చియుంచుటయే కాక నిశ్రేణిమీదుగా దించి విడిచి పెట్టి యెప్పటియట్ల గవాక్షపుకమ్ముల బిగించెద. ఈవిషయ మెవరెఱుంగరానిది సుమా!

విచిత్ర :—అలాగే! మెల్లగా నాబిడను సైతము వెలుపలికి విడువవలయునని నా ప్రార్థన.

మరు :—పదేపదే చెప్పబనిలేదు. అన్నియు నెరవేర్చెద.

విచిత్ర :—(ఖచిత్రసేనుడు చండసేనుని భుజముపై నుంచుకొని మదనికను సైతము క్రిందికి దింపుకొని) మహాశయా! పోయివచ్చెదను.

మరు :—సోదరా! నీకు జయమగుగాక! దీర్ఘాయుష్యమస్తు. త్వరగా వెళ్లిరమ్ము. (నిష్క్రమింతురు.)

---

# చతుర్థాంకము

## రంగము—8.

[ఉజ్జయినీపురము. అందలి పెద్దసత్రము. మదనికా విచిత్రసేను లందుందురు.]

ప్రవేశము :—రూపరేఖ, చంద్రరేఖలు

రూపరేఖ :—చంద్రా! ఈ సత్రమెంత రమణీయముగా నున్నది! ఈ యుజ్జయినీ నగరమునకు తిలకాయమాన వైభవభవన మిది. లోనఁ బ్రవేశించి తద్రామణీయకముఁ గొంతపరిశీలింతముగాక!

చంద్రరేఖ :—రూపా! ఈదినమే సుదినము. నిన్నటిదినముననే మనరాజుగారి యాస్థానమునకు వచ్చి బహుమతులం గైకొన్న విచిత్రసేనుఁడు తనకు ప్రాణప్రియ యగు మదనికను నిచ్చటికిఁదెచ్చి యా బిడకు జ్వరనివారణార్థమై సకలోపచారములం జేయుచున్నాఁడు. లోనఁ బ్రవేశించి వారింగూడఁ జూడవచ్చును.

రూప :—సఖీ! ఆలాగే, లోనికి వెళ్లుదము.

మ. పరదేశీయులు, తైర్థికుల్ నియమసంబంధైకయోగుల్, పదా
ర్థరసాస్వాదనవేదవిద్వరులు, నిర్వాణానులాపుల్, కవీ
శ్వరు, లక్షీణపదక్రమా భ్యసననిష్ణాతుల్, సమభ్యర్చితే
శ్వరు లిందుండి గతాధిజీవనమహో భావంబుఁ గాంతుర్గదా!

చంద్ర :—సఖీ! వీరువారననేల. పండిత పామరాదులకందఱకియ్యది యాస్థానభూమి. (శబ్దమువినునట్లభినయించి) ఎవరక్కడ? మూర్తీభవించిన సుందర విగ్రహము.

ప్రవేశము :—మదనిక.

మదనిక :—చంద్రా! నన్ను దెలియదా! నేనిటకుఁ దేఁబడినదియు నీ వెఱింగియుందువే.

చంద్ర :—అమ్మా! నీవా! నిన్నుచూచుటకే నేనును నాసోదరీ

రూప రూపరేఖయు నవంతీ పురమునుండి వచ్చితిమి. కుశ
లమా అమ్మా ?

మదనిక :—ఇప్పటివఱకు కుశలమే. ఇఁక మీఁదట నేమి రానున్నదో యెవరికెఱుక ?

చంద్ర :—అది నిజమే అమ్మా ! నిన్నటిదినము పుష్పదంతుఁడుకూడ నుజ్జయినీ నగరమునకు వచ్చినట్లు వింటిని.

మద .—ఆక్రూరకర్ముఁ డిచ్చటికి సైఁతము వచ్చెనా ? ఎందుఁబోయి నను మాకర్మమమ్మనుసరించుచున్నదే. ఇఁక నేమి కర్తవ్యము.

రూప :—భర్తృదారికా! అతఁడు విచిత్రసేనునిఁ గూర్చియు, నిన్నుగుఱించియు నందందు వెదకుచున్నవాఁడు. కాని అతని కెవ్వరును మీరాకను దెలిపిన వారుకారు.

మద :—అతఁడు మమ్మెఱింగిన మాజీవితము కడుంగడు శోచనీయమే కదా!

చంద్ర :—అతఁడెఱుంగ కుండునట్లు మేమొక యుపాయముం బన్నెదము. దానికి నీవియ్యకొనెదవా ?

మద :—ఆలాగే.

చంద్ర :—(ఇటునటుచూచి) నీవుమాయింటఁ దెలియక యుండ వచ్చును. ఈ సత్రముననున్న నెట్టులైన నితరులకు నీరూపమే తప్పక చెప్పను.

తే. పక్వబింబంబు తలిరులఁ బ్రబలియున్న
మత్తకోకిల శుష్కాగ మధ్యనున్న
భూరిమాణిక్య మది మట్టి ప్రుంగియున్న
నెందు డాగినఁ దెలియదా యిందురేఖ.

మద :—సఖి ! చేయవలసినది నీవే చేయుము. మాయిరువుర ప్రాణరక్షణార్థమై యొనరింపఁగల కృత్యములన్నియు నీచే నెరవేర్పఁబడుఁగాక !

చంద్ర :—అయిన నీ ప్రాణప్రియుని వెంటఁ బెట్టుకొని రమ్ము. పోదము.

మద :—మత్ప్రియుఁడింత తడవున కిటే వచ్చుచుండును. (తిరిగిచూచి) అదిగో వచ్చుచున్నవారే విచిత్రసేననామక మద్భావి భర్తగారు.

చంద్ర :—ఆహా! ఈతనింజూడ వేయి కన్నులు గావలయును!

తే. మహిని మూర్తీభవించిన మన్మథుండు
మోహినీవేషధారి దామోదరుండు
నవ్యయోగానుభూతి పినాకపాణి
హారిరూప విచిత్ర సేనాభిదుండు.

ఆయుష్మంతులకు జయమగుఁగాక!

సూప :—స్వామీ! ఇటు. ఇటు. రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

రంగము—9.

[ఉజ్జయినీ పురమునందలి యొకవీధి.]

పుష్ప :—కాంతా! నేనెన్నిమారులు మనవివాహవిషయమయి చెప్పినను నీ వట్లు విసుగుచెందుట మంచిదికాదు. నాకంటె మించినవారు ఈ మూఁడు లోకములయందును నీకు లభ్యమగుట చాల యరుదు. కావున నేను చెప్పునది వినుము. వృథాగా నీ జీవితమును జెఱుపుకొనకుము.

కాంతిమతి :—మూఢా! నీ వెవఁడవురా అవిజ్ఞాతుఁడవు. మా తండ్రిని కారాగృహమందుంచి, నన్నువంచించి 'మీతండ్రి యుజ్జయినినుండి నిన్ను వెంటబెట్టుకొని రమ్మనె నని' యబద్ధంబులాడితివి. నీవు పుష్పదంతుఁడవుకావా! నీ కృత్యము లన్నియు మా పట్టణవాసులకు తెలియనివియా? నే నెఱుఁగక నీ వెంటనంటితి. మూఢాత్మురాలను. నన్ను వశం వదగాఁ జేసికొను నీ ప్రయత్నము లన్నియు నిష్ప్రయోజనములు. ఛీ! దూరముగాఁ దొలఁగిపొమ్ము.

పుష్ప :—చానా! నీవు కోపింపకుము. జరిగిన విషయము చెప్పెద

విను. మీతండ్రి దుర్మార్గుఁడై మా శత్రువులఁ గారా గృహామునుండి తంత్రంబున వెడలఁబుచ్చెను. ఆ కారణము చేతనే యాతని కంతటి ఘోరశిక్ష విధించితిని. నీవు నన్నొల్లకుంటివేని నీకును తప్పక మరణదండన విధింతును.

కాంతి :—నీచుఁడా ! తెలియదా నీకు ? మా పక్షమువారందఱు మీ వంశమును నిర్మూలించుటకయి కక్షకట్టి విచిత్ర యంత్ర క్రకచంబును నిర్మించి మీ పక్షమువారి నెచ్చట చూచినను పట్టి హత్యలొనరించుచున్నారు. నీ యీ విషయ మును విన్నయెడల నిన్ను జీవములతోఁ బోనీయరు. జాగ్రత.

పుష్ప :—అది నిజమే. ఎవఁడో తప్పుచేసిన వానిని సాధించుటకు శక్తిచాలక నిరపరాధులైనవారి నందఱఁజంపు శౌర్యులు మీ పక్షమువారు. వారివలన నవంతీవాసులకే హాని కాని యీ యుజ్జయినీ నగరమందున్న నాకేమి కలుగ నున్నది ?
ఓ మూఢురాలా ! మీతండ్రి కారాగృహంబుననే కృశించి యింతదనుక జీవములతోనుండఁబోఁడు. నన్ను సాధించుటకు హరిహరబ్రహ్మాదులకు సైఁతము దుస్సాధ్యము. కాన నోమానినీ ! మానసీయభుజావైభవోపేతు పుష్పదంతాభి ధాన వైరిధూమకేతువును వరించి యనన్య సామాన్య వైభవంబులఁ దులతూఁగుము.

కాంతి :—ఉన్మదుఁడా! నిన్నటిదినమే మీతండ్రిని సైఁతము విచిత్ర యంత్రక్రకచంబుననుంచి విచిత్రవధఁగావించి రని వింటిని. ఇంతటితోనైన వృథాలాపముల మాని పితృమరణ వార్త విని నీ కఠిన హృదయము శోకింపదా యేమి ?

పుష్ప :—హా ! తండ్రీ ! దుర్వినీతమహారాజాధిరాజా ! ఈ దినము నకు నీవు చావవలసివచ్చెనా.........నీవు......చావ...
...వల..సి..వ.చ్చె..నా.హా...(మూర్ఛపడును)
(కొంతసేపటికిఁ దెలివిదెచ్చుకొని లేచి)

ఉ. పుట్టినదాది నీకు చెడుబుద్ధియెకాని యొకానొకప్పుడే
నొట్టిడినట్లు సద్గుణము నొల్లదు నీహృదయం బదేమొకో?
కట్టిడి దైవమిట్లు కడుకష్టదశం జెనకించె; నన్ను నీ
పట్టణమూలదేశములఁ బాఱఁగఁజేసె కడింది దుష్క్రియన్.

తే. గర్భమునఁ బుట్టినదిమొదల్ గాఁగనీకు
క్రౌర్యదుర్వార హృదయప్రకారకార్య
ధూర్వహత్వంబునందున దూరెబుద్ధి
దేవుఁ డున్నాఁడు దండింపఁ దెలిసికొనుము.

తే. కప్పతోమైత్రి వూని నిష్కపటపటిమఁ
ద్రాడు బిగియించుకొనుచుఁ దత్పాదమునకు
మూషికం బలరి కడపట ముచ్చమునిఁగి
నట్టు లయ్యెను నాగతి పట్టువదలి.

హా! దైవమా! నే నేమనవచ్చును. (ఇటునటుచూచి) ఏదీ నా ప్రాణనాయిక! ఎటుఁబోయినది? తండ్రిపోయినట్లే మత్ప్రియసఖియు వెడలిపోయినదే!! (దూరమునఁజూచి) అదిగో పరుగిడుచున్నదే. వేగముగా వెన్నంటిపట్టి యెటుల నైన సాధింతును గాక! (పరుగెత్తును.)

## రంగము—10.

[పురమందలి రాచబాట.]

ప్రవేశము—ఇరువురు రాజభటులు- చండుఁడు, మార్తాండుఁడు.

చండుఁడు:—మార్తాండా! అదిగో పరుగిడుచున్నది యెవరు?

మార్తాండుఁడు:—చండా! అతఁడు దొంగగానుండనోపును. లేని యెడల నీలాగు పలాయనసూత్రము పట్టఁడుగదా!

చండు:—స్నేహితుఁడా! వాఁడు ద్రుముచ్చనుటలో నిస్సందేహము. కాన మనమాతని నవశ్య మనుగమించి పట్టుకొనవలయు సుమా!

మార్తాండు :—వయస్యా! అలాగే చేయుదము. (ఇరువురు పరుగిడి యాతని సమీపింతురు.)

చండు :—(చేయిపట్టుకొని) ఎవఁడవు నీవు ?

పుష్ప :—నేనా.........పరదేశీయుఁడను.

చండు :—పరదేశీయుఁడవు నీవుసరే. ఎందుకు పరుగిడుచున్నాఁడవు?

ప్రవేశము—కాంతిమతి.

మార్తాండు :—చండా! చెప్పకనే తెలియుచుండలేదా! అదిగో ఆ పడుచును పట్టుకొనుటకయి గాలివేగమునఁ బోవుచున్నాఁడు గాఁడా ?

చండు :—వీ రిరువురకేదో యొక సంబంధముండక తప్పదు. (పుష్పదంతునిఁజూచి) అయ్యా! ఎందుకు పరుగెత్తుచున్నాఁడవు ? తెల్పుము ?

పుష్ప :—మహాత్మా! నేను సాయంత్రమైనది గనుక నెవరి పంచనైనను పరుండుట కేఁగుచున్నాఁడను.

చండు :—ఈ సాయంత్రపువేళ నెవరయ్యా! నిదురపోవుదురు ? భోజనము చేసినవెనుకనే కదా నిద్రింపవలయును! ముందే యెవ్వరు నిద్రింతురు? నీ మాటలలో మాకు నమ్మకము లేదు. పోనీ, నీ యూరేది ?

పుష్ప :—సఖుఁడా! నాయూ రిది యది యనుటకు నాకుఁదోఁచుట లేదు. నేను ప్రతిదిన మొక గ్రామము వంతున దేశదిమ్మరిగఁ దిరుగుచుందును. నాకు బంధువులు లేరు. స్నేహితులు లేరు. తల్లిదండ్రులుగాని భార్యాపుత్రులుగాని లేరు. నే నేకాకిని.

మార్తాండు :—చండా! ఈతని ముఖము చూడఁగా నేదో దారఁ బోసికొన్న వానివలె నున్నది. హడావడిగా నడచుచున్నాఁడు. ముందుపోవువనిత సయితము తిరిగి తిరిగి చూచుచు నిలు

చున్నది. పోయి యామెను సైతఁ మడిగిననే సమస్త వృత్తాంత మవగతమగును.

చండు :—సోదరా! ఈతఁడు చెప్పుమాటలలో నాకు పూర్తిగ నమ్మకములేదు. వీఁడొకగ్రుచ్చు. విడువకుము. గట్టిగా పట్టుకొమ్ము. నే నాబిడకడకఱిగి సమస్త వృత్తమును దెలిసికొనివచ్చెదను. నీవు వీనిని గట్టిగఁ బ్రదిలిపోకుండఁ బట్టుకొని యుండుము.

మార్తాండు :—అలాగే, అన్నయ్యా! పోయిరా.

(చండుఁడు వనితను సమీపించును.)

చండు :—ఓ సుమంగలీ! ఈతఁ డెందులకు నిన్ను తరుముచున్నాఁడు? మీ వృత్తాంతమేమి? నాకు సర్వము దాపక తెలుపుము. చూతము.

కాంతి :—సోదరుఁడా! అతఁడు పుష్పదంతుఁడనువాఁడు. అవంతీపుర సార్వభౌముఁడైన దుర్నీతునికుమారుఁడు. మాతండ్రిని కారాగృహమునందుంచి నన్ను బేలుపుచ్చి యిచ్చకములాడి యిచ్చటికిఁ గొనివచ్చి నన్ను వివాహమాడ నిచ్ఛగించి నే నొప్పుకొనమికి చాల కోపించి యెటులనైన నశపఱచుకొనఁ దలఁచి నన్ను వెన్నంటి పరువిడివచ్చుచున్నాఁడు. వీనిని విడువకుఁడు. వీఁడు పరమద్రోహి. మాదేశస్థులందఱతని వంశమునే నాశనమొనరింప బద్ధకంకణులయి యున్నారు. ఈతని రాజసమ్ముఖమునకుఁ గొనిపోయి విచారించి దండింపుఁడు. మహాక్రూరహృదయుఁడు వీఁడు సుమా! విడువకుఁడు. విడువకుఁడు.

చండు :—వయస్యా! అతని నీలాగు లాగుకొనిరమ్ము. అతఁడు గొప్పనేరస్థుఁడు. వీనిని రాజసమ్ముఖమునకుఁ గొనిపోవలయును. (కాంతిమతినిఁ జూచి) అమ్మాయీ! మీరు కూడఁ గొంచెము రాజద్వారము సమీపించి రాజునెదుట

సాత్త్యమొసంగుఁడు. వీఁడు నేరస్థుఁడని తెలిపినచో వీనిని కారాగృహమున వేయించెదము. రమ్ము.

కాంతి :—మిత్రులారా! ఇదిగో వచ్చెదను.

(అందఱు నిష్క్రమింతురు.)

---

# పంచమాంకము

## రంగము—11.

[ఉజ్జయినీపురము.]

ప్రవేశము—మదనికా విచిత్రసేనులు.

విచిత్రసేనుడు :—ప్రేయసీ! ఈ నీ మిత్రమగు చంద్రరేఖాగృహమున మనకిరువురకు వివాహమయిన తరువాత పుష్పదంతుని వృత్తాంతమే వినఁబడలేదు. నీకేమైనను తెలిసెనా?

మదనిక :—ఆర్యా! నిన్నటిదినము పుష్పదంతుఁడు మన మరుదశ్వని కుమార్తెయగు కాంతిమతిని మోసగించి యిచ్చుటకి తీసికొనివచ్చి యాతని యిచ్చు కాబిడ యొప్పమికి మర్దించుటకయి వెనువెంట పరుగెత్తెనఁట,

విచిత్ర :—తరువాత.

మద :—రాజభటులు చాల సందేహించి వానిని పట్టుకొని యామెచే సమస్త వృత్తాంతము నారసి యిప్పుడీ పురాధీశ్వరునిచెంతకు తీసికొనివెళ్లిరి.

విచిత్ర :—ఈ విషయము నీకెట్లు తెలిసెను?

మద :—మన చంద్రరేఖ చెప్పెను.

విచిత్ర :—తరువాత నేమయ్యెను?

మద :—తరువాతి వృత్తాంతము నా కాబిడ తెలుపలేదు. కాన నాకుఁ దెలియదు.

విచిత్ర :—అయిన నేనేపోయి తెలిసికొనివచ్చెదఁగాక. నాకు సెల విమ్ము.

మద :—పోయి త్వరగా రండు. నాపనిమీఁద నేనుండెద.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

## రంగము—12.

[ఉజ్జయినీపురాధీశ్వ రాస్థానము.]

ప్రవేశము—సభాస్థారులు, కాంతిమతి, పుష్పదంతుఁడు, రాజభటులు.

రాజభటులు :—మహాప్రభువులకు జయము జయము.

రాజు :—భృత్యశ్రేష్ఠులారా! ఈ దినమునందలి వృత్తాంతమేమి?

రాజభటులు :—మహాప్రభూ! ఈతఁడొక మాయావి. వీనిని మీరు విచారింపుఁడు.

రాజు :—(పుష్పదంతునిఁజూచి) అయ్యా? మీయూరెద్ది?

పుష్ప :—మాయూ రవంతీపురము.

రాజభటులు :—ప్రభూ! మేమడుగఁ దనకూరే లేదనియుఁ దాను దేశసంచారియనియుఁ దెలిపెను. కాన మాటలభేదము కాన వచ్చుచున్నది.

రాజు :—ఆలాగా. అయితే సరి. (పుష్పదంతునిఁజూచి) అయ్యా! మీ మాటలలో భేదమున్నది.

పుష్ప :—ప్రభూ! అట్టి భేదమేదియు నాకుఁగానరాదు.

రాజు :—నీకుఁ దెలియదుకాఁబోలు. నీ వెందుల కీ పట్టణమునకు వచ్చితివి?

పుష్ప :—వ్యాపారార్థమై.

రాజభటులు :—మహాప్రభూ! ఈతఁ డాయా దేశములఁ జూచుచు

నిచ్చటి కకస్తాత్తుగా వచ్చెనని తెల్పెను. చూడుఁడు వాక్ఛేదము.

రాజు :—సరేకాని యాబిడను నీ వెఱుంగుదువా ?

పుష్ప :—నాకుఁదెలియదు. అవనితాతిలకం బెవ్వతెయో యెచ్చటికిఁ బోవుచున్నదో యేమో నాకేమియుఁ దెలియదు స్వామీ, నాపై దయదలఁచి నన్ను వదలివేయుఁడు.

రాజు :—(కాంతిమతినిఁజూచి) అమ్మాయీ ! ఈతఁడెవఁడు ? ఈతఁ డెందులకు నిన్ను తరుముకొని వచ్చెను ? విషయమును దాపక సవిస్తరముగఁ దెల్పుము.

కాంతి :—ఈతఁడు తెలియదా తమకు ? అవంతీపురసార్వభౌముఁడగు దుర్వినీతుని కుమారరత్నంబగు పుష్పదంతుఁడను మహాక్రూర సర్పంబు. వీఁడు మదనికను, నావనిత యొక్క సోదరుఁడగు చండసేనునిఁ గారాగృహమునందుంచి మా తండ్రియగు మరుదశ్వుని రప్పించి మందు లిప్పించిరి. ఎందుచేతనో చండసేనుఁడు పరమపదించెను. అతని చెలికాఁడగు విచిత్రసేనుఁడు మదనికను మాతండ్రిస్నేహమున రహస్యముగాఁ గారాగృహమునుండి వెలికి తెచ్చి యచ్చటినుండి యీ యూరికి పరువిడివచ్చెనని వింటిని. మా తండ్రియే యీ కార్యమునకుఁ గారణమగుటచే నాతనిఁ జెఱసాలయందు బంధితునిఁజేసి మా సర్వస్వము నపహరించి నన్ను కామించి తోడ్కొని రాజగృహాభిముఖుండయ్యెను. కొందఱు చండసేన విచిత్రసేన సాక్షికులాతని నొప్పించిరి. ఆతఁడు నన్ను విడువక తీసికొని పరుగెత్తి యీ పురమునకు వచ్చెను. ఇచ్చటికి వచ్చినది మొదలు నిచ్చట నన్ను వివాహముచేసికొనుమని నిర్బంధించుచున్నాఁడు.

రాజు :—తరువాత రాజగృహమునకేమయ్యెను ?

కాంతి :—రాజగృహముననుండిన భృత్యుల సామంతుల నందఱఁ

జంపి కడకు మా పాశ్చికులాతని తండ్రియగు దుర్వినీతునే చంపిరి.

రాజు :—అవతలి వృత్తాంత మేమి ?

కాంతి :—ఈ విషయ మాతనికిఁ దెలియకుండుటచే నేను వానికిది దెల్పి స్మృతితప్పించి పాఱిపోవుచుంటిని.

రాజభటులు :—మహాప్రభో ! తరువాతి వృత్తాంతమును మేము విన్నవించెదము.

రాజు :—అటుతరువాత జరిగినది పూర్వమే మీవలన వింటిని. కావున నిప్పుడు కర్తవ్యము నిర్ణయింప సభాస్థారులే యర్హులు.

సభాస్థారులు :—మహారాజా !

తే. అవనిపుఁడు భృత్యునకునిడు నాజ్ఞనెపుడు
ఇంద్రుఁ డద్రుల దండింప నెసఁగియుండు.
మానవాశనులం జంపు మాధవుండు
కానఁ జేయుఁడు కోరిన కార్యమధిప !

రాజు :—నే నెద్దియు నిర్ణయింప నేరకున్నాఁడను. ఇప్పుడు నాకుఁ దోఁచినది యీతనిని మన కారాగృహమునందు సర్వము తెలియువఱకు నుంచుటయే.

సభాస్థారులు :—సెభాష్ ! న్యాయమే.

రాజు :—మంత్రీ, బుద్ధిసారా. అవగతమైనదా !

మంత్రి :—చిత్తము. తమయాజ్ఞ శిరసావహించితి.

రాజు :—ఈ దినమింతటితో సభచాలించెదము గాక.

(అందఱు నిష్క్రమింతురు)

## రంగము—13.

[కారాగృహము.]

ప్రవేశము :—విచిత్రసేనుఁడు, రాజభటులు.

విచిత్ర :—ఆర్యులారా! (కారాగృహమును నిర్దేశించి) ఇదియొక పెద్దభవనముగా నున్నదే. ఇం దెవరుందురు?

రాజభటులు :—రాజదండనకుఁ బాత్రులైన ద్రోహులు, చోరులు మొదలగు దేశభ్రష్టులుందురు.

విచిత్ర :—అట్లైన లోనికిఁబోయి వారింజూడవచ్చునా?

రాజభటులు :—అయ్యా! ఇది చిత్రప్రదర్శనశాలయా? లేక జంతుప్రదర్శన మందిరమా?

విచిత్ర :—క్షమింపుఁడు. లోనికిఁ బోయి వారినిఁజూచి తక్షణమే వత్తును.

రాజభటులు :—లోనికిఁ బోరాదుసుమా? అయినను నీయమాయకత్వమునకు మెచ్చి లోనికి వదలుచున్నారము. జాగ్రతగ వెడలిరమ్ము.

విచిత్ర :—సెలవు గైకొనియెదఁగాక. (లోనికిఁబోవుచు) ఎడమకన్నదరుచున్నదే. ఇదియేదో యనర్థమును సైఁతము సూచించుచున్నయది.

క. కుడికన్నదరిన సౌఖ్యము
కడువడి దడ నెడమకన్ను కష్టముగలుగుఁ
జెడుదురు మనుజు లదృష్టపు
నిడుమలచే దీనిభావ మెఱుఁగక మనసా!

(బంధనమున నుండు పుష్పదంతునిఁజూచి)

ఉ. ఇప్పుడు నాదు శాత్రవుఁడు హీనబలుండయి యిందుఁగష్టముం
జొప్పడియున్నవాఁడు తనచోటికిఁబోయి మనంబెలర్ప నా
చొప్పఱయంగఁ గోరెదను సుందరరూపుఁడు శూరవర్యుఁ డీ
యొప్పమి దుర్దశన్ మనసు నుద్ధతిమీఱి యెసంగునే కదా!

విచిత్ర :—అరరే! అతని కార్యము లత్యద్భుతములు, మహాగర్భనిర్భేదములు, అసహాయ శూరకరణంబులు, క్రూరవ్యాసంగ పర్యవసాయంబులు గదా!
(లోనికిఁబోయి) ఆహా! అదిగో అచ్చట ప్రచండ రౌద్రాకారుఁడై శృంఖలాబద్ధుఁడైయున్నవాఁడు. వీనిరూపమత్యద్భుతము (సమీపించి, సంకెలలూడఁదీసి) ఆర్యా! పుష్పదంతా! నీయీ యాపత్కాలంబున నేదేనొక సాయం బొనర్ప నేతెంచితి. నన్నర్థించెదవుగాక!

పుష్ప :—ఓరీ! మిత్రకులాధమా! నిన్ను ...... నిన్ను ......నే నర్థించునట్టి శౌర్యహీనుఁడనా? నీవా నాకు సాయమొనర్పఁ బ్రయత్నించువాఁడవు.

తే. త్రిపురదాహంబునందున దేవదేవు
నకు నెవండు సహాయంబునకుఁ గడంగె
రాక్షసాళినిఁ జంపు నారాయణునకు
నెవఁడు సాయంబు చెప్పుమా హితవిలోల.

తే. శత్రుపక్షపువాఁడవై శతవిధాల
మాపయిం దీక్ష్ణయంత్రధారాపనితము
లధికతరశీధుపానదృప్యన్మహోగ్ర
మత్తతన్ గొల్పి చంపిన మానహీన!

తే. నిన్నుఁ జంపెద మత్కాళిరనిశితఖడ్గ
వన్యసర్పోగ్రరసనానివార్యధారఁ,

ప్రళయదివసాతిదుర్భరభైరవాత్త
గర్భదుర్భేదభిదురజాగ్రత్తరాశి.

(అని ఖడ్గము జళిపించును. విచిత్రసేనుఁడు క్రిందపడిపోవును.)

శా. రాజద్రోహరగండలాంఛనుఁడు, సంగ్రామైక భీముండు, స
ద్రాజత్కీర్తి దిగంతరాళ విభవోదగ్రుండు, నాచేత ని
ర్వ్యాజఁ జావఁగ బమ్మచెయ్గిమవుగా యూహింప బ్రహ్మాక్షరం
బేజన్మాంతరవాసనాబలముచే నేలాగు దిద్దంగనౌ.

పుష్ప :—(ఆత్మగతము) మద్రాజవంశ నాశకుండైన విచిత్రసేనుం
డును మరణించెను. ఇఁక నింతటి ద్రోహు లెవరును లేరు.
నేనింక సులభముగా మదనికను కాంతిమతిని నిద్దఱ వరించి
సఫలీకృత మనోరథుండ నయ్యెద.

ఉ. కాంతిమతీకళత్రుఁడని కాంచెదనామము కీర్తినర్తకీ
కాంతమృణాళికన్ మదనికన్ వరియించెద నెట్టులైన నా
పంతము చెల్లెఁగాక యిటువంటి కులాధము లెంద ఱెట్టి సం
క్రాంతమహోగ్రహోగ్రులయి క్రాలిన బీరము చెల్లనేర్చునే.

(అనుచుఁ దనవంక వీక్షించుకొని)

తే. మత్కృతాఖిలపాపసంభవవిధాన
కలితశృంఖల లివి విశృంఖలము లయ్యె
మత్కృతాఖిలకార్యవిస్మయవిచిత్ర
సేనకరపంకజవిశేష సేవచేత.

(అనుచు నాతని యుడుపులం దవిలించుకొని మాఱువేషము
తోఁ గారాగృహమునుండి వెడలిపోవును.)

## రంగము—14.

[ఉజ్జయినీ పురమునందలి యొక సౌధము.]

ప్రవేశము :—మదనికా చంద్రరేఖలు.

మదనిక :—చంద్రా! మేమీగృహమునకు వచ్చినది మొదలు మాయిద్దఱకు సౌఖ్యముగానే యున్నది. కాని నిన్నటిదినము నాభర్త యియ్యారి విషయములం దెలియఁగోరి వెడలిపోయి యింతదనుక రాలేదు. నాకు రాత్రియంతయు నిద్దురపట్టక మనస్సు అశ్వత్థపలాశమురీతి చలించుచునే యున్నది. స్వప్నమునందొకనల్లని పురుషుఁడు వికారాకారుఁడై దేహామాద్యంతము తైలమలందుకొని నన్నుచంప నుద్యుక్తుఁడై తరిమెను. నేను భయభ్రాంతనై రాత్రి కేఁకలిడితినిగదా!

చంద్ర :—అమ్మా! రాత్రి నీ కేఁకను విని యేదో స్వప్నమని తలఁచి యూరకుంటిని. అప్పుడే నా గుండె లదరి యఱగంటవఱకు దడయాగినది కాదమ్మా!

మదనిక :—చంద్రా! నేను కడుంగడు దురదృష్టురాలను సుమా! మజ్జీవితేశ్వరుని జీవములనే నేను సంశయించుచున్నదానను.

చంద్ర :—అట్లనుకుమమ్మా! అమంగళము ప్రతిహతమగునుగాక!

ప్రవేశము :—కాంతిమతి.

మదనిక :—చంద్రా! అదిగోదారిలో పోవుచున్న చక్కని యువతి యెవరో తెలియునా?

చంద్ర :—తెలియదమ్మా! ఉజ్జయినీ నివాసిగాఁ దోఁచుటలేదు.

మదనిక :—(దృష్టిసారించి) ఆయువతి మత్ప్రాణ సఖి కాంతిమతి, మరుదశ్వపుత్రి.

చంద్ర :—అటైన నవశ్యమామెను ప్రవేశపెట్టెదను. అనుజ్ఞయా?

## రంగము—15.

[ఉజ్జయినీ పురోద్యానవనము. పుష్పదంతుఁడు విచిత్రసేనుని యుడుపులతో నిటునటు తిరుగుచుండును. మదనికా కాంతిమతీ చంద్రరేఖ లొకయరుగుపై కూర్చుని పుష్పదంతునిఁ జూచి విచిత్రసేనుఁడని భ్రమపడెదరు.]

ప్రవేశము :—మదనికా కాంతిమతులు.

మదనిక :—కాంతీ! మత్ప్రాణనాయకుఁ డిదిగో యీ వాసంతికా పుష్పమాలాలంకృతకుడుంగమార్గమున వచ్చుచున్నాఁడు. చూడుము.

కాంతిమతి :—సఖీ! నీకువెఱ్ఱిపట్టినదా! ఇఁక నెక్కడిభర్త. విచిత్రసేనవీరవరాభిధానుండు.

మదనిక :—కాంతీ! నీవట్లనకుము. బాగుగా చూడుము.

కాంతి :—భర్తృదారికా! అతండాయుష్మంతుని లీలఁ గాన్పించు చున్నాఁడు. అతనికై నా హృదయము తహతహ పడుచున్నది.

మదనిక :—అమ్మా! నా పల్కులు కుఱుచ సేయకుము. ఆ వచ్చునదే విచిత్రసేనవీరవరాభిధానుండు. జగన్మనోనురాగుండు. మదవతీ మానపశ్యతో హారుండు.

చంద్ర :—ఆర్యపుత్రికలారా! ఈతఁడు నాకుఁజూడ నార్యపుత్రుఁడనియే ప్రత్యయంబగుచున్నయదియు.

మదనిక :—అట్లైన నాతని సమీపింతము.

కాంతి :—అతఁడిటే వచ్చుచున్నాఁడు. కన్నులపండువుగాఁ జూడ వచ్చునుగదా!

చంద్ర :—చూచుటయేకాక సల్లాపములచేతను, సత్క్రియలచేతను మనమనహృదయంబుల సంతసింపఁ జేసికొనుట కిదియే యదనని చెప్పకతప్పదు కదా!

కాంతి :—సఖీ? అతనియందు నాకధికమోహభావ మంకురించు చున్నదికదా!

మదనిక :—మత్పతి నీకును పతిగాఁగలఁడని ముందే నేను నా సోద రుని ముఖమునుండి వినియున్నదానను. దానికిదే తా ర్కాణము.

చంద్ర :—అయినన నార్యపుత్రికల సేవించుభాగ్యము యుగపదను సంధేయమే కదా!

మదనిక :—(విచిత్రసేనాపరవేషధారియగు పుష్పదంతుని సమీ పించి) ఆర్యపుత్ర! జయము. జయము.

వి. పుష్ప :—ప్రాణప్రియా! చిరాయురారోగ్యభోగభాగ్యైశ్వ ర్యాభి సిద్ధిరస్తు.
(అటుచూచి) కాంతిమతియు నిటనున్నదే.

మదనిక :—మాతోనిన్నటిదినమే కలిసికొనెను. తనకష్టములన్నియు నంతరింపఁగా నిప్పట్టున నందఱము సౌఖ్యముగనే యున్నా రము.

వి. పుష్ప :—అందఱును గలిసి వర్తింతము. మదనికా! నీవును కాంతిమతియు నాకు మిక్కిలి కూర్చువారలుగదా! మీ యందు సమాన ప్రేమభావమంకురించి యున్నది.

చంద్ర.—ఆర్యపుత్రా! మద్గృహంబున మీరు కాంతిమతీ మదనిక లతోడ మత్సేవసైఁత మంగీకరింతురని యనేక విధముల మిమ్ముఁ బ్రార్థింతును.

వి. పుష్ప.—అందుకు సందేహములేదు. యుష్మద్గృహంబే యస్మ ద్గృహంబని తావకీన సర్వస్వంబు మామకీనంబనియు భావిం చి జీవించుటకు నాకెంతయు సమ్మతంబ.

కాంతి.—అటే చేయుదముగాక. నలువురము సుఖజీవులముగా నుండెదముగాక.

మదనిక.—(కొంత సందేహించి, కాంతిమతిం దగ్గఱిదూరముగాఁ బోయి చెవిలోఁ జెప్పుచున్నది.) కాంతీ! వీనిజాడఁజూడ విచిత్రసేనుఁడుగా నాకుఁదోఁచుటలేదు. వీనికృత్యములతి కఠినములగుటచే వీఁడు పుష్పదంతుఁడేయయి యుండ వచ్చును. మత్ప్రాణనాయకునిఁజంపి యతని యుడుపులంద విలించుకొని మనల భ్రమింపఁజేయుచున్నాఁడు.

కాంతి.—చెలీ! అదినిజమే. వీఁడు నరహంతకుఁడు. వీనిస్నేహము మనకు వలదు.

మదనిక.—ఇఁకనెట్లు. వీని బారినుండి తప్పిపోవుట మృత్యుముఖము నుండి తప్పిపోవుటయే యగును.

కాంతి.—ఎటులనైన మనము పాఱిపోవలయును గదా! మన సంశయమును దెలిసినయెడల మనకె గ్గొనరింపక మానఁడు.

మదనిక.—కాంతిమతీ! నాప్రాణములా క్రూరమృత్యువున కర్పిం పను. నా యుద్యమము నెరవేరదుకాఁబోలు. నే నుత్తమ క్షత్రియవంశసంజాతను. చూడుము. ఇదే నాచేతి కర వాలంబున హత్యచేసికొనెదను.

కాంతి:—సఖీ! ప్రేయసీ! నినుబాసి నేనుండనేరను. నేనును నిన్ననుకరింతును.

మద:—(తనకత్తిచే పొడుచుకొని క్రిందపడి మరణించును,)

కాంతి.—హా! చెలీ! ఎంతకష్టమెంత కష్టము.

తే. కీర్తికై ప్రాణములఁగూడ గెడయుచుంద్రు
మానహానికి భయపడి మడియుచుంద్రు
గారవమునకు లోనైనఁ గందుచుంద్రు
మహిత నైర్మల్యహృదయులు మానధనులు.

(కాంతిమతి మూర్ఛిలును. ఇదిచూచి చంద్రరేఖా పుష్ప దంతులు పరువిడివచ్చి కాంతిమతిని సేదదేర్తురు.)

కాంతి.—నా ప్రాణప్రియలేని బ్రతుకేటికి ? నన్నును మోసపుచ్చితివి కావా ? నీవు పుష్పదంతుఁడవు కావా ?

చంద్ర.—సఖీ ! కోపింపకుము. మీప్రాణప్రియుఁ డీతఁడు విచిత్రసేనుఁడని తలంచి యిప్పుడు పుష్పదంతుఁడని తెలిసికొంటివి కాఁబోలు. కాని యీతఁడును విచిత్రసేనునకు నేవిషయమునందును దీసిపోవువాఁడు కాఁడు. కావున నీతని నమనయింపుము. (పుష్పదంతునిఁజూచి) ఆర్యపుత్రా ! ఈవనితనోదార్చి కైవసమొనర్చికొని ధన్యుఁడవు కమ్ము.

పుష్ప.—(కాంతిమతినిఁ జూచి)

తే. నీకొఱకుఁగాదె రాజ్యంబు పోఁకసేసి
కన్నతండ్రిని సైఁతము కడవఁబెట్టి
సర్వ సౌఖ్యంబులను వీడి చాలనొచ్చి
సంకటాలకు నోర్చితి పంకజాక్షి.

ప్రేయసీ ! నన్ను నీవానిగాఁ గైకొని హృదయంబర్పింపుము.

కాంతి.—ఆర్యా ! నీవు మోసమొనరించినందున నిన్ను నాహృదయము నమ్మకున్నది.

పుష్ప.—ఇఁక నమ్ముము. ముమ్మాటికి నమ్ముము.

శా. చంద్రాదిత్యులు తారలుఁ బ్రీదిలి యాశాభిత్తులం గూలినన్
ఇంద్రాగ్నుల్ శమనాదిదైవతములెంతే ధర్మముం దప్పినన్
రుంద్రక్రీడ నెసంగి యీ భువనమున్ రుద్రుండు వేకాల్చనీ
చంద్రా ! కాంతిమతీ ! మదీయరసనన్ జంచద్గతుల్ పొల్చునే?

ఈ పుష్పదంతుఁడు పుష్పనారాచుఁడు సుమా !

కాంతి.—సఖీ ! చంద్రా ! ఈతని నాహృదయమిప్పుడు కొంచెము నమ్ముచున్నది. కాన నితనికి నాహృదయం బర్పించెదను. అగ్నిసాక్షికముగా రేపు వివాహమగుట మనకుఁగర్తవ్యము.

చంద్ర.—శుభస్య శీఘ్రమ్మనవినమే. అది నెరవేరును గాక!

పుష్ప.—అయినమన మందఱము కల్యాణ కార్యకలాపంబుల నెర వేర్చుకొనియెదము. పోదము రండు. అయిననిట్లగుఁగాక!

భరతవాక్యము.

ఉ, పాడియుఁ బంటయుంగలిగి భవ్యతరంబుగ సౌఖ్యసంపదం
బోడిమిచెంది పౌరులు విభూషితులై పొలుపొంద గోవులున్
బాడబులున్ విశేషసుఖబంధురభావభవాభిరాములై
వాడియెసంగఁగన్ భరతవర్షమునన్ శుభముల్ వెలుంగుతన్.

చంద్ర.—ఆర్యపుత్రునకు జయము. జయము.

(అని యందఱు నిష్క్రమింతురు.)

ఇది శ్రీరామచంద్రచరణారవిందవందమానమానసేందిందిర
మహావైభవ కొప్పుకొండ గురుస్వామ్యాఖ్య తనూభవ
సుజనవిధేయ వేంకటసుబ్బరాఘవ నామధేయ
విరచితంబయిన కాంతిమతీపుష్పదంత
నామక దృశ్య కావ్యము
సంపూర్ణము.